అని క్రియ (మేషము), తాబురి (వృషభము), జితుమ (మిథునము), కులీర (కర్కాటకము), లేయ (సింహము), పాథోన (కన్య), జూక (తుల), కౌర్పి (వృశ్చికము), తాక్షిక (ధనుస్సు), అకోకేర (మకరము), హృద్రోగ (కుంభము), అంత్యభం (మీనము), ద్వాదశరాసులకు గ్రీకుభాషానామములు పెట్టియున్నాఁడు. ఇందుకులీర, హృద్రోగ, అంత్యభశబ్దములు తక్క మిగిలిన వన్నియు గ్రీకునామములే. వరాహమిహిరుఁడు క్రీస్తుశకము ౫౦౫-వ సంవత్సరమునఁ బుట్టి ౫౮౭-వ సంవత్సరమున మృతినొందెను. ఈయన కాలమునకుఁ బూర్వమునందుండిన సిద్ధాంతగ్రంథములలో సహితము గ్రీకులు (యవనులు) జ్యోతిశ్శాస్త్రమునందు గట్టివారయినట్టు చెప్పఁబడియున్నది. మిక్కిలి పురాతనమగు గర్గసిద్ధాంతములో

శ్లో॥ మ్లేచ్ఛాహి యవనాస్తేషు సమ్యక్శాస్త్రమిదంస్థితమ్
ఋషివత్తేపి పూజ్యంతే కింపునర్దైవవిద్ద్విజః."

(యవనులు మ్లేచ్ఛులయినను వారియం దీశాస్త్రము చక్కగానున్నది. వారును ఋషులవలెఁ బూజింపఁబడునప్పుడు దైవజ్ఞులయినద్విజులను జెప్పవలసినదేమి?) అని వ్రాయఁబడియున్నది"

దీనిని బట్టిచూడఁగా నిప్పటివారివలెఁ దామే సర్వజ్ఞులమనియుఁ దమ పూర్వులు చెప్పినదొక్కటియే సత్యమనియు భావించుకొనువారుగాక యప్పటివారు తాము స్వయముగాఁ గృషిచేసి శాస్త్రజ్ఞానమును వృద్ధిపఱచియుఁ దమకుఁ దెలియనిదాని నితరదేశస్థులవలన గ్రహించియు నభివృద్ధిఁ జెందుచు వచ్చినట్టు కనఁబడుచున్నది. తామే సర్వజ్ఞుల మన్న గర్వమును, తామితరులవలన నేర్చుకొన్నచో గౌరవలోపమను దురభిమానమును, గల వారెప్పుడును వృద్ధినొందక క్రమక్రముగా క్షీణదశకువత్తురు. కాఁబట్టి పురోవృద్ధిగోరువారు తాము సత్యమును సర్వవిధముల సంపాదింపఁ బ్రయత్నించుచు మంచి యెందున్నను గ్రహించుచుండవలెను. పైనిచెప్పిన దురభిమానము మనదేశమునందుఁ బ్రబలి సర్వమును మన శాస్త్రములలోనే యున్నదనియు మనమితరులవలన నేర్చుకో

వలసిన దేదియు లేదనియు దురభిప్రాయము బలపడనారంభించినది మొదలు శాస్త్రజ్ఞానమంతకంతకు వృద్ధినొందక క్రమక్రమముగా క్షీణదశకువచ్చుచుఁదుద కిప్పటిహీనస్థితికి వచ్చినది. ఈ నడిమికాలములో నొక్క భాస్కరాచార్యుఁడు దక్క చక్కని సిద్ధాంతగ్రంథములను రచియించినవారెవ్వరును గానరారు. ఈ భాస్కరాచార్యుఁడు తాను రచించిన సిద్ధాంతశిరోమణియను జ్యోతిశ్శాస్త్రమునందలి గోళాధ్యాయములోఁ దాను జననమొందిన శకసంవత్సరము 1036 అనియు, గ్రంథరచనచేసినది తనముప్పదియాఱవయేటననియుఁ జెప్పుకొనియున్నాఁడు. యూరపుఖండములో 1543-వ సంవత్సరమునందుఁ బరలోకగతుఁడయిన కోపర్నికస్సను జర్మను పండితుఁడు సయుక్తికముగా స్థాపించువఱకును భూభ్రమణసిద్ధాంతము వ్యాపింపలేదు. ఈ భరతఖండములోఁ గ్రీస్తుశకమున నైదవశతాబ్దములోనుండిన యార్యభట్టాచార్యులవారు వరాహమిహిరునకుఁ బూర్వమునందే భూభ్రమణ సిద్ధాంతమును బోధించిరి. కాని యది ప్రబలక మధ్యగా భూమి స్థిరముగానుండి దానిచుట్టును సూర్య చంద్ర నక్షత్రాదులు తిరుగుచున్నవన్న యపసిద్ధాంతమే నేఁటివఱకును వ్యాపించియున్నది. మనపూర్వులకు గ్రహాదుల గతులు తెలియునుగాని గ్రహములకును భూమికిని గల దూరములు సరిగాఁ దెలియవు. ఆకాలమునందు సహితము నళికాది యంత్రము లేవో కొన్నియున్నను గ్రహవేధకయి యిప్పుడున్న దూరదర్శక యంత్రాదులప్పుడు లేనందున నిప్పుడు తెలిసికొన్న యనేకాంశములు వారి కప్పుడు తెలియుట యసాధ్యమయ్యెను.

ఈగ్రంథమును రచించుటకయి నేనింగ్లీషుభాషలోనున్న కొన్ని జ్యోతిష గ్రంథములను జదువుటయేకాక సంస్కృతభాషలోనున్న సూర్య సిద్ధాంతము, సిద్ధాంతశిరోమణి, పంచసిద్ధాంతిక, మొదలయిన సిద్ధాంత గ్రంథములను సహితము చదివితిని. మనలోని తెలిసినవారి సాయమువలన రాత్రుల గ్రహములు నక్షత్రములు మొదలయిన వానినిజూచి వాని స్థానములను రూపములను గ్రహించితిని. నేనుచెన్నపురికిఁబోయి యుండినప్పు డచ్చటి నక్షత్రశాలాధికారుల సాహాయ్యమువలన పగలు శని గ్రహాదులను శని గ్రహముయొక్క యుంగరములను

దూరదర్శక యంత్రముతో నచ్చటి యుద్యోగస్థులు చూపఁగాఁ జూచితిని. ఈ పుస్తకమునందు నేను సాధ్యమైనంతవఱకు పారిభాషిక పదములను రానీయక సుగమముగా నుండునట్లు సులభశైలినే యుపయోగించినను శారీరశాస్త్రమునందువలెనే దీనియందును ఇంగ్లీషు పర్యాయపదములతో పారిభాషిక పదములపట్టికను తుదను జేర్చితిని. పటములు లేని యెడల విషయము సుబోధముగా నుండదుగనుక విశేషవ్యయముచేసి యాయాగ్రహనక్షత్ర ధూమకేతు సూర్యచంద్రోపరాగాదులను జూపెడు పటముల నేఁబదింటికంటె నెక్కువగా నింగ్లండునుండి చేయించి తెప్పించి యిందు యుక్తస్థలములయందు వేయించితిని. గ్రహణవిషయమున సామాన్య జనులలో వ్యాపించియున్న పిచ్చి నమ్మకమును బోఁగొట్టవలెనన్న యుద్దేశముతో గ్రహణములకు నిజమైన కారణములను దెలుపుటకు ముందవతారికగా జ్యోతిశ్శాస్త్ర సంగ్రహమునందుఁగొంత వ్రాయఁబడినది. చదువరులకింపుగా నుండవచ్చునని దానినిం దుదాహరించుచున్నాను.

"సూర్యబింబముయొక్కగాని చంద్రబింబముయొక్కగాని కాంతియంతయుఁగాని కొంతగాని మాయుట గ్రహణమనఁబడును. బింబముయొక్క కాంతియంతయు నడఁగినచోఁ బూర్ణగ్రహణమనియుఁ, గొంతమాత్రమే యడఁగినచోఁ బార్శ్వగ్రహణమనియుఁ, జెప్పఁబడును. సంపూర్ణ సూర్యగ్రహణము పట్టినప్పుడు సర్వమును వింతగాఁగానఁబడును.—పట్టపగలు మింటనక్షత్రములు కానిపించును; పక్షులు కొలకొలమని కూయుచు గూండ్లుచేరఁ బాఱుతెంచును: ఘూకములు గుహలు వెలువడి నానాముఖముల సంచరించును; మూఢుల మనస్సులలో భయ మంకురించును. వేయేల? పగలే రాత్రియగుట సంభవించినప్పుడు లోకములోని వేవి తాఱుమాఱుకావు? ఈ ప్రకారముగా వ్యత్యస్తదశ సంభవించుటచేత నాలోచనలేని మృగపక్ష్యాదులు సహితము తమతమ స్వభావగుణములను విడిచి తేజోవిహీనములయి నిరుత్సాహములయి యుండునప్పుడు, ఆలోచన పరుఁడయిన మనుష్యుని హృదయమునందు భీతిచేత నెన్ని యూహలు పుట్టవు? మన దేశమునందలి జనులు గ్రహణసమయములయందు సూర్యచంద్రులకేదో, పెద్దపాము మ్రింగుటచేత, మహావిపత్తు సంప్రాప్తమయినదనియుఁ, తమ్ము

మైలసోఁకినదనియు భావించి,స్నానములు చేసియు, నుపవాసము లొనర్చియు, దోషపరిహారార్థముగా దానధర్మము లాచరించియు, నానావిధకర్మలు చేయుదురు. దేశమజ్ఞాన దశయందుండిన కాలములో సాధారణముగా జనుల మౌఢ్యమహిమచేత నిట్టియాచారములు మొట్టమొదట నుద్భవమొందును; పిత్రాచారమన్న గౌరవమునుబట్టి యాలోచనమాని తెలివిగలవారు సహిత మాచరించుచు రాఁగాఁ గొంతకాలమున కామూఢాచారములు శిష్టాచారములగును: అటువంటి స్థితిలో బుద్ధిమంతులయిన యాచార్యపురుషులు బైలుదేఱి యంధపరంపరగా జనులాచరించెడి యాయాచారములనే తాము నవిచారపూర్వకముగా ననుసరించుచు వానిని దమకు జీవనాధారములుగా మార్చుకొని లాభకరములయిన యట్టి యుత్తమాచారములను గల్పించిన పూర్వుల బుద్ధి సంపదను శ్లాఘించుచు స్వార్థపరత్వముతో వానికి హేతుకల్పనముచేసి పుస్తకములను రచించి పామరులను మోహింపఁజేయుదురు. దురాచారము లెప్పుడును బ్రవేశించినంత సులభముగా వదలిపోవు. ఎంత యవివేకమూలకమయినదైనను, దేశమునందొక్కసారి నెలకొన్న యాచారపిశాచము చిరకాలము పలువురు పలుప్రయత్నములుచేసి కష్టపడి వెడలఁగొట్టఁబాటుపడినంగాని యొకపట్టునకాలుకదల్పదు. గ్రహణములకు ధీమంతులయిన మన పౌరాణికులు కల్పించిన కారణముల నెల్లవారు నెఱుఁగుదురుగదా! విప్రచిత్తికిని సింహికకును జతుర్భుజుఁడయిపుట్టిన రాహువనెడు రాక్షసుఁడొకఁడుండెనఁట! దేవదానవులు పాలసముద్రమును మథించి పడసిన యమృతము నుభయపక్షములకును నిష్పక్షపాతముతోఁ బంచిపెట్టెదనని చెప్పి విష్ణుఁడు జగన్మోహినీ వేషమును ధరించి వచ్చి దేవతలకుఁ బోయుచుండఁగా వారు త్రాఁగియానందించుచున్నప్పుడు విష్ణుమాయకులోనయి భ్రమపడి యూరక గుటుకలు మ్రింగుచుఁ జూచుచున్న రాక్షసపంక్తినివిడిచి బుద్ధిమంతుఁడయిన రాహువు మోహినీ వేషమునకుఁ బ్రతిగాఁదాను దేవతావేషమును ధరించి దేవతాపంక్తిలోఁగూర్చుండి యెల్లవారిని మాయచేసిన విష్ణువునే మాయచేసి యమృతపానముచేయఁ జొచ్చెనఁట! [illegible]